# గమనిక

ఆకర్షపు రంగులో మిలమిల మెరిసే ఓ పెట్టె
ఒక్క ఉదుటన్న తొంగి, లోని పొరను సూసి మల్లెనుకున్న
దాన్లోని గన్నేరుని ఇసుమంతైన గమనించకున్న
అదేపనిగా, పీల్చి పీల్చి ఉచ్వాస నిశ్వాసల్ని ఆవిరి తో నింపి
అజరామర భరితుడ్నై విహంగంల విహరించ
మిత్ర సలహాలు సహించక అవి మిత్రశత్రువులివనుకున్న
గురువాజ్ఞలు గురువిందమందాన్న కర్ణ కఠోరాలుగా విసర్జించ
ఫలితం...నా ఈ ప్రస్తుతం..
రక్తం రేతిరి వర్ణాన్ని పులుముకుంటుంది
కండ్లు శాశ్వత నిద్రకు అలమటిస్తున్నాయి
పెదాలు  ఎడారులవుతున్నాయి
సున్నితమైన అంతర్గత ఇంద్రియాలు అచంచలమైన  సేద కొఱకు పాకులాడుతున్నాయి
విషఘుడియ వేగంగా చొచ్చుకురాడానికి అర్రులుచాస్తుంది
జీవితం క్షణభంగురం అనే ఆర్తనాదం, మరికొద్దిసేపట్లో
మా వాళ్ళ నాలుకల్లో నర్తించడానికి సిద్ధంగుంది
ఇసుమంటి అనుభూతిని  అనుభవించినోడిగా
నీతో ..దిక్కులు పిక్కటిల్లేలా ... ఊహూ...అసాధ్యం...
అందుకే, మసకబారుతున్న కళ్ళ సైగలతో...రా..దరికి రా
ఆకర్షపు రంగులో మిలమిల మెరిసే పెట్టె  వెనుక భాగాన,
కంటికి అగుపించి అగుపడనట్టున్న ఈ అక్షరాల్ని చూడు....నిఖార్సీగా.....

ధూమపానం ఆరోగ్యానికి హానికరం

-వరప్రసాద్
9533114111